UU

66

Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరు.

| సంపుటము 33 | 1941 సం॥ డిశంబరు నెల 15వ తేది | సంచిక 9 |
|---|---|---|

విషయములు.






చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |


Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్పగిరి

౨ తుంగడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౩ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౪ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు, రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౫ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౬ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౭ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు, హంపి.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౯ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇనునూరు.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - దేవిడి

౩ కాంద్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము,

# అభినవసరస్వతి

సంపుటము 33 | వృష సం॥ మార్గశిరమాసము 1941 డిశెంబరు 15 తేది | సంచిక ౯

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠము, బెజవాడ

వర్ణాశ్రమధర్మవ్యవస్థాపకములగు గురుపీఠము లున్నను శ్రుతిశేషార్థం స్మృతి రక్షాగచ్చ తత్రన ట్లయ్యాచార్యపీఠముల నర్చించుచునే తదభిప్రాయములు లోకమున వివరించి ధర్మప్రచారము చేయుట యీపీఠముయొక్క కృత్యము. ఇయ్యది యమృతానందనాథులచే నుద్దిష్టము. వీరు పాదుకాంతదీక్షాధరులు. ఆ దీక్షానామమే యమృతానందనాథు లనునది. అసలు వీరు పాలావఝ్ఝల నాగభూషణముగారు. ఆయావిషయము లన్నియు దిగువపద్యములు తెలిపెడిని.

సీ. ఇల్లల పాలావఝ్ఝలాన్వయాంభోరాశి
కమృతాంశుఁడై యొప్పఁ డనతరించె
వెలనాటికులమణి వేంకటరత్న ధ
రామరుం డెవ్వని కయ్యెఁ దండ్రి
శ్రీలక్షమ్మంబు మహాలక్ష్మి యెవ్వానిఁ
గడుపారఁ గాంచి భ క్తతతి కిచ్చె
సత్యనారాయణ సహజున్మఁడై యేని
కాభాష్య మెఱిఁగె బాల్యమ్మనందె
సోదరీమణి వేంకటసుబ్బమాంబ
బావ గంగాధరుం డేనిబాంధవమున
అంతవారైరి జగమున నతఁడె నాగ
భూషణగురుం డనంబడు భువనమందు.




ఉ. దినమొకవిద్యగాఁగ మును దేశికునొద్ద నెఱుంగ నేర్చు వె
న్నని యవతారమే యని తనుం గొనియాడఁ గుశాగ్రబుద్ధు లం
దని వినువీథిఁబట్టి గురుతత్త్వముగాంచెను నాగభూషణుం.
డనితరసాధ్యమైన లవణాబ్ధిఁ దరింపఁడె వాయుపుత్రుఁడుఀ!

శా. ఏదో దగ్గఱతోవ యుండవలెఁ గానీ కానిచో శాస్త్రముల్
భేదింపంగలఁ డెట్లు బాలకుఁడు నిర్భీకుండు! శ్రీకంఠునే
వాదంబందున గెల్చు నీతని ప్రభావం బద్ధిరాయంచు స
ద్వాదుల్ మెత్తురు నాగభూషణుఁడు తత్త్వంబుం బ్రసంగించుచోఀ.

ఉ అద్దమహాంబె, శాస్త్రముల నడ్డులు గడ్డులు లేవదెందు, నా
అడ్డముతీతె, నా తెలివె యాత్మఁడనన్ గురుమూర్తితోడనే
గుడ్డను జోలెకట్టుకొని కొంకక భైక్షముఁబూని భాష్యమే
అడ్డములేక జుట్టుకొనె నద్దిర ! నాగవిభూషణుం డహో !

శా. ఏరామల్ సరివత్తురే, విభుఁడు తానే తా విభుండే యనన్
ధారాళంబుగ సర్వధర్మములలోఁ దాదాత్మ్యముం దాల్చి సీ
తారామాంబిక యున్న నాల్గుదినముల్ ధన్యాత్మయై పోయె న
య్యార్యే మ్రొక్కెదఁ గీర్తికాయ గురుజాయన్ ధీరగేయన్ సదా.

ఉ. ద్వాదశవర్షముల్ ఘనతపం బొనరించుచు సద్గురుండు స
న్మోదముతోడ సోదరుని బూన్చి గృహంబునఁ దాఁ ద్రిదండియై
పోదునటంచు నుండఁగనె పోయెను దమ్ముఁడు. ఈశ్వరేచ్ఛ యే
మాదిరివారి నెట్టిటుల మార్చుదు తాను స్వతంత్ర యాటచేన్?

ఉ. కొంప మునింగెనంచుఁ దల కొట్టుకయేడ్చెడు తల్లి దన్ను శా
సింపఁగ సద్గురూక్తి నది సిద్ధముగా గణియించి యొండు చ
ర్చింపక సుప్రసన్నమును జేకొని కాంచె సుతద్వయంబు వి
ర్చింపఁ బిత్ర్యాణమున్ గురుఁడు పెద్దలమాటలు పాటిసేయుచున్.

ఉ. రాముఁడు సోముఁడున్ హరిహరంబగు పేరులటంచు నుంచెఁ ద
న్నామము లాత్మజాతులకు నాగవిభూషణుఁ. డన్వహంబు శ్రీ
రామపదామృతంబును నిరంతరముం జవిగొంచు నన్యమున్
మామకమంచు నెంచఁ. డనుమానము పొందఁడు. ఉండు దండిగన్.

మ. అమృతానందుఁడు, యోగి, నిస్పృహుఁడు, ధీరాగ్రణ్యుఁడు, శిష్టుండు దృ
శ్యము నశ్యంబగునంచు దానిపయి విశ్వాసంబు చేయండు, బ్ర
హ్మముగాఁ జూచును సర్వమున్, శిశువునే నర్చించు శ్రీకృష్ణుఁగా,
శమసంపన్నుఁడు, లక్షణంబులకు లక్ష్యం బౌర సద్గోష్ఠిలోన్.

క. శ్రీవిద్య బ్రహ్మవిద్య మహావిద్యయనంగఁ బాదుకాంతంబగు దీ
క్షావిధిఁ బెద్దలుదాల్తురు. కైవల్యప్రదము సిద్ధికరము జగమునన్.

క. నతియున్ నుతియున్ లేకయ
యతులటు లీపూర్ణదీక్ష నలరిన గురు లా
నతభక్తకోటి కిచ్చెద
గతిలోకం బైనపద మనాయాసముగన్.

(కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు)

...శ్రీశైల దాక్షారామ కాళేశ్వరములయందుఁగల లింగములకు మధ్యఁగల దేశము త్రిలింగదేశము. కలౌ వేంకటనాయక యను న్యాయమునఁ గలియుగమున కధినాథుఁడగుటచే నాతని శ్రీనివాసనామంబున నున్న పీఠము...

శ్లో. అమృతానందనాథేన నిర్మితం శర్మదం నృణాం
కర్మభూమే రలంకారో విద్యాపీఠ మనుత్తమం.
యస్మిన్ ప్రతిదినం విష్ణుపంచాయతనపూజనం
సహస్రనామభిః పుష్పైః క్రియతే పరమాదరాత్.

(వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు)

ఉ. ధీరత నీశ్వరార్పణమతిన్ నిజధర్మము నిర్వహించు లే
భారతభూమికిం గలుగు వ్యక్తివిశేషము. దాని వీడి సాం
సారికదుఃఖభీరులయి సంయమిగోత్రజు లెల్ల నీచసే
వారతులై విదేశజుల భాషలు భావము లాత్మ మెచ్చుచున్.

క. ప్రాకృతులై పాశ్చాత్య
ప్రాకృతశాస్త్రముల హాయల భ్రాంతులగుచు వి
ప్రాకృతియు గేలిసేసి తృ
ణీకృతబుధవర్యు లగుచు నిట్టవాడుచుచున్.

క నిగమ మగణ్యం బనుచున్
నిగమాంతం బెల్ల నరయ నీరసమంచున్
నిగమము తప్పి దురాశా
నిగళంబులఁ దగిలి పొగిలి నిరయం బందన్.

చ. కని యనుకంప మద్గురుఁడు కర్షణయోగ్యము కానివేళ వి
త్తనముల గుప్తిసేసెడువిధంబునఁ దక్షిణపండితాళి నే
అనువునన్నైన నిల్పఁగఁ బ్రయత్నముసల్పుఁడు, బాహ్యలోకవా
సన లితరంబులున్ విడిచి సద్గతిఁబొందుఁ, డటంచుఁ దెల్పినన్.

శా. ప్రారబ్ధంబున లభ్యమానమగు వ్యాపారంబులన్ నిల్పి యా
త్మారామస్థితినంద సంతతము నంతర్లక్ష్య మీక్షించుచున్
శ్రీరామార్చలు సల్పుచున్ బుధుల గోష్ఠిం దేలుచుం దత్త్వగం
భీరంబుల్ కృతులే మొనర్చెదము మాపీఠంబునన్ నిచ్చలున్.

క. నిధు లుండి కాదు మే మీవిధమున బుధపూజసలుప వేడుట. మాకున్
మధుసూదనాంఘ్రియుగసన్నిధియే బల మిట్టిపనులు నిర్వర్తింపన్.

(దంటు శ్రీనివాసశర్మగారు)

ఉ. మానసచక్రముం దగిలి మౌనులు మున్నది గొందు ద్రావెలె న
ద్దానిని నైమిశంబని సదా యట నిల్పిరి పుత్రయాగ. మీ
స్థానము కృష్ణనామమునఁ దా విజయంబిడుఁ దెల్గుభూమికిన్
కానఁ ద్రిలింగపీఠ మిట నాఁటితి. మిందున నిల్చె దెందముల్.

చ. తిరుమల శ్రీనివాసవినుతిం జెలువొందెడి కల్పశాఖికిన్
గురువరుఁ డంటుకట్టి యెటో కుండకు దింపిన దానిఁ దెచ్చి యీ
పురమున నాఁటినాము. సురభూజము సద్ద్విజసేవ్య మిద్ది. శ్రీ
కరము త్రిలింగపీఠమని ఖ్యాతివహించు జగద్ధితంబుగన్.

ఉ. ఏము త్రిలింగపీఠమున నెంతయుఁ బూనిక సత్కళాన్వితుల్
క్షేమముగా స్వవిద్యలను శిష్యుల కీదగు దారు లన్నియున్
సామముతోడఁ దెల్పెదము. సర్వజనుల్ దరియింప బీజముల్
భూమిని నిల్పి పుణ్యమునఁ బొందెదరు. ఏమిక వెండుమాటలున్ ?

(కవితిలక కాంచనపల్లి కనకాంబగారు)

నిత్యము నిందు శ్రీవేంకటేశ్వరస్వామికిఁ ద్రికాలములయందును దక్షిణ యాదిత్యాంబికాగణనాథుల కేకవారమును సహస్రనామార్చనములు ప్రత్యేకముగా మహానైవేద్యములతో జరుగును. ప్రతిదినముఁ బ్రాతఃకాలము వేంకటేశ సుప్రభాతసేవ. పీఠము బెజవాడలో స్థాపింపఁబడిన సంవత్సరముపాడుగునఁ బ్రాతఃకాలము స్వామి సన్నిధిలో శాంకరసూత్రభాష్యప్రవచన మైనది. ప్రకృత ముపనిషద్భాష్యప్రవచనము జరుగుచున్నది. ప్రతిదినము సాధారణముగా మధ్యాహ్నములయందును విశేషముగా నాదివారము సాయంకాలమందును పీఠస్థాపకులగు నమృతానందులవారి బోధలు చేయఁబడును. సంధ్యాకాలమున వేదపారాయణము జరుగుచుండును. అనువత్సరము నమృతానందనాథులకు జయంతిమహోత్సవము సాగింపబడియెడు. ఆ యుత్సవములలోఁ బ్రసిద్ధ పండితులకుఁ బారితోషికము ప్రదీయమానము. అది యిప్పటికి యిందఱ కీయఁబడినది.

1 మహామహోపాధ్యాయ కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రులుగారికి 116
2 ఆమ్నాయార్థవాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రులుగారికి 116
3 వేదాంతసార్వభౌమ కీ॥ శే॥ చెందుకూరి నరసింహశాస్త్రులుగారికి 116
4 తార్కికచక్రవర్తి కీ॥ శే॥ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రులుగారికి 116
5 వైయాకరణసమ్రాట్టు మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రులుగారికి 116
6 కింకవీంద్రఘటాపంచానన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులుగారికి 116
7 గురుభక్తశిఖామణి టి. కె. బాలసుబ్రహ్మణ్యయ్యరుగారికి 116
8 కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారికి 116

9 అవధానిశిరోమణి మహోపాధ్యాయ సాహిత్యధర్మస్థాపక
కాశీ కృష్ణాచార్యులుగారికి 116

10 పండితప్రవర వ్యాఖ్యానవాచస్పతి కీ॥ శే॥ మల్లాది రామకృష్ణ
చయనులుగారికి 116

ఇట్టికార్యభరము నొదల వహించి నడిపించుచున్న ధన్యాత్ములలో నగ్రగణ్యులు తచ్ఛిష్యులు

1 వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు

2 కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు.

3 చుండూరి వెంకటరెడ్డిశ్రేష్ఠిగారు

ఈపీఠమునుగూర్చిన పొగడ్తలు గ్రంథములుగనే యున్నయవి. మచ్చునకు ముచ్చటగా 3 కనఁబఱతుము.

శ్లో. శ్రీమ ద్వేద షడంగదర్శనకలాభాషాసముద్ధారతో
విద్యాపీఠ మిదం ప్రతిష్ఠితమివ త్రైలింగ మార్యావనౌ
ధర్మోద్ధారకృతే మహాకవివిభుప్రస్థానదుశ్శాసనా
క్రాంతాయాం విబుధార్హకం విజయతాం శ్రీనాధకారుణ్యతః.

(విద్వత్కవిరత్న పుల్య, ఉమామహేశ్వరశాస్త్రిగారు)

శ్లో. అమృతానందనాధేన స్థాపితం పీఠ ముత్తమం
విజయాఖ్యే పురే రమ్యే సదా విజయతే తరాం.

(కాళ్ళకూరి మహాలక్ష్మీసుందరమ్మగారు, బి. యే., యల్. టి.)

శా. శ్రీ పెంపారఁగ భారతావనికి వాసింగూర్చు వేదాదులే
ప్రాపుంగానక తూల వాని నిటు తేర్పంజూచు త్రైలింగవి
ద్యాపీఠం బొనరించు యత్నము సమస్తాంధ్రావనిం గాక తా
ప్రోవై భారతదేశ మంతటికి సమ్మోదంబు చేకూర్పదే ?

చ. తిరుమలఁ బుట్టి చెన్నపురిఁ దీరి యిటుల్ బెజవాడలోపలన్
వఱలు త్రిలింగపీఠము శుభంబు లొసంగెడు దుర్గభంగి, శ్రీ
కరుఁడగు మల్లికార్జునటు గణ్యత గాంచెడు, కృష్ణపోలికన్
సురుచిరవైభవోన్నతుల శోభిలుచున్ బుధపాళి నోముతన్.

(శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు)

## —♦ అమృతానందనాథస్వామి జయంతిమహోత్సవము ♦—

ఇయ్యాది యువ సం॥ కార్తిక బ ౧౦, ౧౧, ౧౨ (నవంబరు 14, 15, 16) 3 దినములు ముఖ్యముగా జరిగినది. అందుఁ బెరపక్షమునుండి, అజ్జాడ ఆదిభట్ట నారాయణదాసుగారికిని సామగాయనసార్వభౌమ క్రిష్టిపాటి లక్ష్మీనరసింహ సాగ్నిచిత్సర్వపృష్ఠాప్తోర్యామ వాజపేయ బృహస్పతి సవనయాజులవారికిఁ గాఁబోలు 116 లు పారితోషికప్రదానము కావింపఁబడియెను. ఇట్టిమహోత్సవము శ్రీజగన్నాథపండితరాజ వర్ధంతితోడను నగరసంకీర్తనములతోడను బహిరంగసభలతోడను కృతిప్రదానములతోడను నుపసభలతోడను వైయాకరణాహితాగ్నిపరిషత్తులతోడను సాంధ్రిత త్త్వవిశారదా పాత్యక్రమాయుర్వేదాష్టాంగహృదయకౌముదీపరీక్షలతోడను నన్నదానములతోడను శ్రీపీఠస్థాపకామృతానందనాథస్వామి చరిత్రబోధలతోడను గనకాంబాకృత శ్రీపీఠగురుపరంపరా పద్యకావ్యపఠనముతోడను బండితగోష్ఠులతోడను బిరుదప్రదానములతోడను గృతికర్తృ కృతిభర్తృ సన్మానములతోడను సర్వతంత్రకలాశాలాసంస్థాపనతోడను జరిగి సంస్తుతిపాత్రం బైనయది. భాషోద్ధారక వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారును మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారును, క్రిష్టిపాటి లక్ష్మీనరసింహయాజులుగారును నవధానిశిరోమణి కాశీ కృష్ణాచార్యులుగారును, గింకవీంద్రఘటాపంచానన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారును నాయాసభల నగ్రపీఠ మలంకరించుచు వచ్చిరి. మఱియుం వైయాకరణకేసరి పుల్య, ఉమామహేశ్వరశాస్త్రిగారు పిశుపాటి చిదంబరశాస్త్రిగారు కంభంపాటి రామకృష్ణశాస్త్రిగారు కవిరత్న వేలూరి శివరామశాస్త్రిగారు కవితార్కికసింహ గోవిందాచార్యులుగారు మున్నగు విద్వాంసులు కవులు విచ్చేసి ప్రత్యహముఁ బరిషత్తు నలంకరించుచు స్వస్వవిద్యావైశద్యమున సభ్యుల సంతోషపెట్టఁ గలిగిరి.

కలకత్తా విశ్వవిద్యాలయవిద్వాంసులును నఖిలభారతవర్షీయబ్రాహ్మణమహాసమ్మేళన మవిముక్తక్షేత్రమం దాచరించి యశమార్జించినవారును నఖండపండితులును నఖిలబ్రాహ్మణులును నగు ననంతకృష్ణశాస్త్రిగారును నరుదెంచి యస్ఖల ద్దాత్రీయామర భాషోపన్యాసముచే నఖిలవిద్వజ్జనమనంబుల నాకర్షించిరి. ఆదిభట్ట నారాయణదాసుగారి హరికథాగానము పండితపామరులనెల్లరను బరమానందవారిధిం బడఁద్రోసెను. రెడ్డిగారు వీరికి స్వయముగా మఱియొక 116 సమర్పించిరి. సర్వతంత్రస్వతంత్రకళాశాల స్థాపితము. తత్కళాశాలా కార్యారంభమును గంభంపాటి రామకృష్ణశాస్త్రిగారు కావింపనున్నవారు. సాహిత్యమునకును విద్యలకును నొక్కొక్కరినిగాని యిద్దఱిద్దఱినిగాని యత్యుత్తముల నేరి వారి కొక్కరుగాని యిద్దఱుగాని యుత్తములగు శిష్యుల సంధానము చేసి గురుశిష్యుల సమావేశమునకుఁ దగిన వసతి కలిగించుటయే తత్కళాశాలా నిర్మాణము. ఒకచో నొక 50 విద్వత్కుటుంబములైనను దమతమ శాస్త్రములయందలి యుద్గ్రంథములఁ జదివియు శాస్త్రాంతరమునఁ బ్రవేశముకలిగించుకొనియుం నన్యోన్యసహాయముచే సర్వతంత్రములయందును స్వాతంత్ర్యము కలవా రగుదురు. ఇకార్యమున విద్యాబీజములు నిలుచును. ఈవిద్వత్కుటుంబములు శ్రౌతస్మార్తకర్మలకును

బ్రహ్మచర్యాద్యాశ్రమములకును నాలంబనములగును. ఇట్టిసంస్థను సామాన్యులు సంపన్నులు నందఱును జేరి నిలువఁబెట్టినచో వేదశాస్త్రపురాణేతిహాసాదులకును సాహిత్యమునకును నాలంబన మగును.

---

## — కృతిస్వీకరణము —

శ్రీ అమృతానందనాథస్వామి జయంత్యుత్సవాంగముగనే తచ్ఛిష్యులలో నొకరగు చుండూరు వెంకటరెడ్డిగారిచేఁ గృతిస్వీకరణము చేయఁబడియెను. కృతికర్త శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు. కృతిపేరు శివభక్తి. మహాసభామధ్యమునఁ దాను గృతినాథుఁడుగా నుండిన తచ్ఛివభక్తిని వెంకటశాస్త్రిగారి ముఖమున విని వేయినూటపదియాఱులతో వెంకటరెడ్డిగారు శాస్త్రిగారిని సత్కరించిరి. శాస్త్రిగారి కవితాసౌష్ఠవముతో పాటు శ్రేష్ఠిగారి మహాదార్యమునుగూడ విద్వాంసులు వేనోళ్ళఁబొగడిరి.

తే. గీ. కృతులతోపాటుగాఁ గృతిపతులుగూడ
విశ్వమందున నిల్తురు శాశ్వతముగ.
అదిర! శివభక్తి కృతినందినట్టి సుకృతి
కృతులకెల్లను దా నలంకృతియె జగతి. శివభక్తి ప్ర॥ ఆ 3।

మ. గుడులున్ గోపురముల్ సరోవరములుం గూపమ్ములున్ సత్రముల్
చెడు. ఎల్లప్పుడు నిల్వనేరవు. కృతిస్వీకారవైనా! అట్లుకా
చెడఁబో. దక్షయమౌచు నక్షరవిదుల్ సేవింప నీలోక మె
ల్లెడ సంచారము సేయుచుండుకతనం గృత్యాఖ్య యుత్కృష్టమౌ.

మ. అమృతానందగురుం డుపాధి నిలపైఁ ద్యాగమ్ముగావించి బ్ర
హ్మాము తాఁ గూడిన నున్నయట్లుగొలుచున్,మానుష్యం,డహో! రెడ్డి. ని
త్యమునుం దద్గురుమూర్తి నాథునునిబోధంబుం దలం దాల్చు. త
త్త్వము నొక్కప్పుడు నేమఱందు. గురుమంత్రంబున్ జపించున్ సదా.

సీ. శ్రీశైలమల్లేశు సేవించి యచ్చోట
శాశ్వతమ్ముగ ధ్వజస్తంభ మెత్తె.
వృషము దాన ఘటించు బెటిఁగి వృషోత్సర్జ
నం బొనర్చెను వైభవం బెలర్ప.
ఆ కాశిసేతుపర్యంతమే కాక తీ
ర్థాటనం బొనరించె నవలఁగూడ.
అల్ల నెల్లూరి బృహస్పతిసవనాన
నర్పించె దక్షిణ నడిగినంత.

ఇచ్చె నొక్కబ్రాహ్మణునకు గృహముగట్టి
ఏదొ మిషమీఁద సందల కేచ్చుగా. అ
నేకులను బోషణముసేయు కెల్ల రెఱేఁగి
నట్టిదే. వేలుపులగిడ్డి యగును రెడ్డి. 26

శా. బీయేయాంగ్లమునందు. సంస్కృతమునన్ విద్వత్తనార్జించె. ఎం
దో యేమాత్రమొ కాదు వ్యాకరణమందుంగూడ సంస్కారిగా
నేయుండెన్. కులవృత్తిలో నితనికిన్ దీటెందుఁ గన్పట్ట. దెం
దో యుండున్ సుకృతాత్ముఁడీదృశమహోద్యోగుండు గోమట్లలో.

చ ఓఱకితనంబు కోమటుల బిడ్డలపాలని యంద్రుగాక. త
త్పరిచితి వీనిపట్టున యథార్థముగాదని చెప్పనొప్పు. ఇ
ప్పరముఁడు చెన్నపట్నమునఁ బచ్చపకాలెజి నున్ననాఁటి య
చ్చరితము సాక్ష్యమిచ్చుఁ గడుసాహసి యీతఁడటంచుఁ జెప్పఁగన్.

ఆ వె. నాకు వర్తకమ్మునం గల మర్మముల్
తెలియ. వక్కతమునఁ దెలుపఁజాల.
ఇతఁడు మట్టి చేత నెత్తి యద్దాని బం
గరువు సేయఁజాలుఘనుఁడు. ధ్రువము. 29

కం. ఎపు డమృతానందుండను
తపస్విక్రృప రెడ్డియందుఁ దవిలెనొ సకలం
బపుడె చేకురె సుస్థితి.
కృపగల దేశికు లొసఁగని శ్రేయము లన్నే! 32

తే. గీ. ఇతఁడు బెజవాడవాసి. స్వగృహము నల్ల
గురువుపేరనె కట్టించె. మఱవఁ డెపుడు.
గురుని యుపదేశములు మది స్మరణసేయు.
ఇహముకన్నఁ బరమ్మునకే యతించు. 36

అని యిట్లు లున్నదియున్నట్లు వెంకటరెడ్డిగారి విద్యావినయవివేకాదులు వెంకట శాస్త్రిగారే విలిఖించిరి. సనాతనధర్మపరులగు శాస్త్రిలుగారు శివునకు నారదమహర్షి చెప్పినట్లుగాఁ గథ కల్పించి యిప్పటి దేశపరిస్థితు లిశివభక్తిలో నిట్లు వర్ణించిరి.

శ్లో॥ ధర్మములను పేరిట నపధర్మము లెన్ని యో పుట్టుచున్నవి శంభో!
అవి కల్పించెడివా రవివేకులు గారు వివేకులె నిక్కము శంభో!

చేత నాయుధము కలదని పూసిన
చెట్లు నఱకెదరు శివ! శివ! శంభో!
ఎండినచెట్టున కాపూవు లతికి
ఏమో చేతుర టయ్యయొ శంభో!
నీవున్నావని నీమిత్రుఁడు శ్రీహరి యున్నాఁడని యెఱుఁగరు శంభో!
గుడిలో నున్నది ఆయేయని నిశ్చయ మేర్పడ్డది వారికి శంభో!
బ్రాహ్మణబ్రువులు వేదశాస్త్రములు వెక్కిరించుటకు వెఱవరు శంభో!
ఇట్టివిపర్యాసము చూచియు నీ వేలాగున నూరకొంటి శంభో!
సూతులఁగాంచినవారికిఁ బూర్వము కొండంతపున్నె మనికద శంభో!
ఇప్పుడుసూతులఁ గాంచినవారికి నెట్టినరకమో తెలియదు శంభో!
జాత్యుత్కృష్టత నేఁటివారలకు నెందులకుం గొఱగాదఁట శంభో!
ఇచ్చిపుచ్చుకొనునప్డుగూడఁ గుల మెట్టిదైన సరియేనట శంభో!
ఉన్నారింకను ధర్మవేత్తలగు నూర్జితమతు లచ్చటచట శంభో!
వారిమాటలను వినువారులేరు నూతికొకరైన మచ్చుకు శంభో!
ఇదియేమిఘోర, మిదియేమిపాప? మిదియేమిధర్మ? మెట్లిఁక శంభో!
జాతిభేద మంతరించినప్పుడె చచ్చె భరతఖండము శివ! శంభో!
కాకులను గొట్టి గ్రద్దలకు వేయు
పనులు మొదలువెట్టిరికద శంభో!
ఇవి యిహానకే కాక పరానకు
హానికరములని యెఱుఁగరు శంభో!
ఓనమాలువచ్చినప్రతివాఁడును బండితబిరుదాంకితుఁడే శంభో!
పండితశబ్దానకు నెంతటిదురవస్థ పట్టెనో చూడుము శంభో!
వశముగాని సంస్కారణములెత్తిరి జగచ్ఛ్రేయమునకంచును శంభో!
ఇవి తుదనెగ్గిన నెగ్గకయున్నను నిప్పు డెందఱికొ ముప్పగు శంభో!
అప్పుల నెగఁగొట్టుట దోసముగాదని యొక్కఁడు నొక్కిచెప్పు శంభో!
వ్యభిచరించుటయు వివాహమే యని మఱియొక్కఁ డుపన్యసించు శంభో!
మునిఁగిపోవుచున్న దికద లోకము ముప్పులలో! ఇఁక నాఁగదు శంభో!
అప్పులువోయెడి నెగఁబెట్టినచో ముప్పులటులు వోవవుగద శంభో!
ముప్పునుండి తప్పించి లోకమును గాపాడుట నీభారము శంభో!
నీ యునికిఁదెల్పి లోకము నెఱుకలో నిల్పఁ సమయ మిదిగదయ్య శంభో!

దేవాలయములు పాడఱుకాలము పమీపించినది కంటివె శంభో!
ఎక్కడనుండెద? వీపైని నీకుఁ జోటే కనుపడదుకదా శంభో!

శ్లోకములని వీని నాంధ్రములో వ్రాయుటయు నందైనను వృత్తగణ యతి ప్రాసలు లేకుండుటయు విద్వత్కవులు కొందఱకు వెగటుగా నున్నయది ఇదియే కాదు వీరు వ్యాసములు గ్రామ్యభాషలో వ్రాయుటకూడ విద్వత్సమ్మతము కాదు. ఇట్టి జగద్విఖ్యాత విద్వత్కవుల గ్రామ్యరచన గ్రాంథికవాదులఁ గలవరపెట్టుచున్నది. శ్లో॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః. శాస్త్రులవా రేదియో సమాధానము చెప్పుదురుకాని యది యంత తృప్తికరమై యుండదు.

కం. మనుజుం డేది యొనర్చిన
తనబుద్ధి ప్రమాణ మనుచుఁ దలఁచి సలుపరా.
దనఘుము వేదము. దానిని
తనబుద్ధికిఁ దోడుసేయఁదగు నెప్పట్లన్. 130

ఈపద్యమే శాస్త్రిగారి ప్రమాణబద్ధతను జాటుచున్నది. ఆంధ్రభాషకు దద్వ్యాకరణమే వేదము. కావునఁ దన్నియమము వ్యాసాదులపట్లఁగూడఁ బాటించుచునే యుండుటకుఁ బలువురు ప్రార్థించుచుండిరని వెంకటశాస్త్రిగారికి విజ్ఞప్తి. శాస్త్రులుగారిట్లు సంస్కారములగొడవ యంతయు శంకరునకు నారదముఖమునఁ జెప్పించి తరువాతఁ బరమేశ్వరుఁడు కుకలంబునఁ గోమటిబిడ్డఁడవై పుట్టి కొంత విప్లవము నణఁచుమని కుబేరున కాజ్ఞయిచ్చుటయు నతఁ డఱుపదేశమునఁ దిరుపంకాడయనాఁ బరమభక్తుఁడుగాఁ బ్రభవించి యాభక్తిమార్గమున నసత్పథగాముల ననేకులఁ దరింపఁజేయుటయుఁ గథాభాగముగా గ్రంథమును గూర్పఁగలిగిరి. సందర్భానుసారముగాఁ జాలచోటులఁ బాతివ్రత్యాది ధర్మములు ప్రబోధితములు. ఆ పాఠకులకు బహూపయోగకరములగు పద్యములు కొన్ని క్రిందఁ బొందుపఱతును.

తే. అవిధినా కృత మకృతమం ప్రాగమజ్ఞ.
లక్కతమ్మున విధినిషేధాదు లెఱిఁగి
ఏది చేసిన నది ఫలియించు. అట్లు
కానిచో భస్మహవ్యమ్ము కవణి వమ్ము. ద్వి.ఆ 117

శా. పాతివ్రత్యము గోలుపోదురు సతుల్ బ్రాహ్మణ్యముం గోలుపో
చూతు ర్విప్రులు. క్షత్రియుల్ కరుణకున్ సున్నం బొరిం జుట్టఁగా
నేతుర్. వైశ్యులఁ జెప్పనేటికి? కసులన్ వీడంగఁ గొంకర్కదా!
ఏతత్సర్వము కాంచనంపు గొనమే. ఎవ్వాఁ డెఱుంగం డహో!

చం. కనకము కొన్ని బారువులుగా దిన మొక్కటి కిచ్చుశక్తి గ
ల్గినదనిగా శమంతకము కృష్ణుఁడు లచ్చిమగండు సత్యతం
డ్రి నడిగె నోరువిప్పి! అవనిం గనకంబును జూచి మోహమున్
కననిఘనుండునుం గలఁడె? కాంతల కయ్యదియే సమస్తమున్. 31

కం. సన్యాసులమంచు మతో
పన్యాసము లిచ్చువారు బంగారునెడన్
మాన్యతఁజూపుదు. రిఁక నే
ధన్యులనిది వశ మొనర్పఁదలఁపదు త్రుటిలో? 38

కం. ఏదో తప మొనరించి క
దా దేహి జనించు ధనికు నపథమున! స
ర్వాదరణీయం బది యా
స్వాదించుట దోసనునెడి జ్ఞానులు గలరే? 104

తే. గీ. పెఱటిచెట్టు మందుకు రాని తెఱ గెఱింగి
జనకరాజర్షి కడ కంపి సలుపఁదగిన
యంతయును సల్పి యత్నమ్ము వ్యాసమౌని
కడకు సుతుఁ బెండ్లికొమరునిఁగా నొనర్చె 111

ఉ. సంపద గల్గుచోట గుణసౌరభ మంతగ నుండ. దట్టిబల్
సంపదకన్న రిక్తతయె చాల యశస్కర. మెన్నియెన్ని మేల్
కెంపులు వజ్రముల్ మెఱుగు కృత్రిమభూషలు మేనఁదాల్చినన్
సొంపుదయింప దంగనకు. శుద్ధచరిత్రమె భూషణం బగున్. 165

చం. వనితకు భర్తకన్న భగవంతుఁడు వేఱుగ లేఁడు. హానియం
దునఁ గడుభక్తితో మెలఁగుతొయ్యలి కీ యిహమ్ము బరమ్ము హా
స్తనిహితమైన రేఁగుగతిఁ దా వశమై యశమిచ్చు దీనిఁ గా
దని మఱి యన్యథా మెలఁగునంగన లంగడిలోని వస్తువుల్. 166

కం మగఁడు సుదుర్వృత్తుం డని
మగనా లటు కాఁదగదు. ప్రమాణజ్ఞులు బా
గుగఁ బరిశీలించిరి. అది
నగుఁబాటని. రదియు మదికి నచ్చు సతులకున్. 167

కం. అసతులు వేయుదు రెన్నియొ
విషమంపుం బ్రశ్నములు. వివేకిను లవ్వా
ని సహింపరు పాతివ్ర
త్యసమం బగువ్రతము నాస్తి నాస్తి యువతికిన్

తే. గీ. వర్తకము వృత్తులను ధనవైభవంబు
కలుగఁజేసెడి దైనను గపటిగాని
వాఁడు దాని కుపచరించువాఁడు గాఁడు.
కపటి యెన్నటికిని మోక్షకామి గాఁడు. 225

కం. భగవద్గీత సులభముగ, అగుపట్టెడిఁగాని దానియందలి యర్థం
బు గురూపదేశరహితులకగమ్యగోచరరహస్య మని యెఱుఁగనగుఁ.
కం తిననంబోయెడి. తినకుండినను౦ బోయెడిని. ఆఁకటికి లోనై దాం
గనిపించుకొనుటకంటెఁ ఘనులకు భైక్షంబు మేలుగాఁదోఁచుఁగదా!
ఆ. ఆపద్ధర్మమ్ము వణి
గ్వ్యాపార మనండు మనువు పలుదోషము లీ
వ్యాపారమునం గలవని
ఆపరముఁడు కృషికి ద్విజుల కనుమతి యిచ్చెఁ. 29
చం. ధనము మదంబు పెంచుఁ దనుదార్ఢ్యము దుర్బలులం గలంచు నే
ర్చిన ఘనవిద్య వాదములు సేయుటకుం బురికొల్పు నీచవ
ర్తనుల. కివే మహాత్ములకుఁ ద్యాగము సజ్జనరక్షణంబుఁ జి
జ్జననము సంఘటించి పరసాధకమై పొలుపొందు నెమ్మెయిఁ. 104

ఇట్టిధర్మములు, ఒకభక్తుని చరిత్రము, కొకటశాస్త్రిలుగారి కవిత్వము. ఇట్టి శివభక్తి యొంతచదివినను దనివితీరదనియే నాయభిప్రాయము. ఇట్టిగ్రంథమును గృతినొందఁ గలిగిన రెడ్డిగారు ధన్యులు. దీని వెల రు 1.0-0

శా. ఆరోగ్యం బెవలేనిసంపద మహాదార్యంబు నిత్యోత్సవ
శ్రీరోచిష్ణుత శాంతి దాంతి విబుధాశీర్వాదసంపత్తి సం
సారానందపరోపకారముఖ మైశ్వర్యంబు మా రెడ్డిసం
సారిం బాయక యెల్లవేళ విమలాచారుఁ సుఖిం జేయుతఁ. 196
మ. గురుభక్తుం డగు రెడ్డి కెల్లపు డెపంగుంగాక శ్రేయంబు. మా
గురుమూర్తుల్ గురుమూర్తి లీత నిరోడం గొండొక్కలోపంబు మే
మరయంబోమని దీవనల్ సలుప నత్యంతంబు శ్రీవేంకటే
శ్వరు నాశీర్వచనమ్ము దాని కిడుతఁ సాహాయ్య మెకాలముఁ.
తే గీ. రెడ్డి తలపెట్టినట్టి సత్కృతుల కెల్ల
అప్పరాశక్తి విద్వదుపాస్య తోడు
నీడమై మంచి కీరితి నించుఁగాక.
ఇహపరమ్ముల సుఖ మిది యిచ్చుఁగాక. 193
తే. గీ. రెడ్డివా రాజవా యని వృద్ధులాడు
పల్కున కొంకండె లక్ష్మియై ప్రబలుఁగాక.
రెడ్డి వైకల్పికత్వమ్ము నడ్డగించి
ధనమును యశోధనంబుతోఁ దనరుఁగాక. 199

తథాస్తు.

## —• యాదగిరి యుత్సవము •—

యాదగిర్యుత్సవము యథాప్రకారముగ నైనదని విడుచుటకంటె నధికము వ్రాయుట చర్వితచర్వణమని పాఠకులు పరిహసించినను గ్రొత్తక్రొత్తమార్పులనుగూర్చి కొంత ముచ్చటించుట తప్పక వచ్చినది. స్వామి బ్రహ్మోత్సవ కల్యాణోత్సవ గరుడోత్సవ గజోత్సవ రథోత్సవాదులకును సహస్రసంఖ్యల యాత్రికులు చనుదెంచి స్వామిని సేవించి కానుక లర్పించుటకును మార్పు లేమియుం లేక యుత్తరోత్తరాభివృద్ధిలో నుండుచున్నవి. యాత్రికులు నివసించుటకు భక్తులు నిర్మింపించు హర్మ్యములు బహుళమై పట్టణములను మఱపించుచున్నవి. క్రొత్తక్రొత్త విద్యాధికులు విచ్చేసి పరీక్షితులై స్వవిద్యావైశద్యమున సభ్యుల నానందపెట్టి బహూకృతు లగుచున్నారు. అట్టివారిలో సం॥ గంటి వెంకటేశ్వరావధానులుగారి కుమారుఁడు క్రమాంత స్వాధ్యాయమునను తర్క-వ్యాకరణకవిత్వాదులఁ జివుకుల అప్పయ్యశాస్త్రిగారు కంచిభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మున్నగువారును హరికథాగానముల కుప్పా వీరరాఘవయ్యగారు ముక్కామల భానుమూర్తిగారు చందాల కేశవదాసుగారు మొదలగువారు. వేదశాస్త్రసభలు విద్యాధికుల వినుతికిఁ బాత్రమై విరాజిల్లుచు వచ్చినవి. సర్వజనులకును సంతోషదాయకములై సంగీతసభలు సాగినవి. హరికథ లత్యానందజనకము లైనయవి. సంగీతపరీక్షకులగు పాపట్ల హనుమచ్ఛాస్త్రిగారు పలుమాఱులు పాటఁబాడి యఖిలప్రజాహృదయములు హరించిరి. కొదమసింహము లక్ష్మణాచార్యప్రభృతుల పిడేలువాద్యమును ముత్తేవు రంగాచార్యులుగారు పూజారి పుల్లయ్యగార్ల మర్దలవాద్యమును మఱిమఱి హరికథాగానసభల కందమునిచ్చినవనుట యతిశయోక్తి కాఁజాలదు. వీరు మార్దంగిక శిఖామణులు. ఊఱక వాయించియు సూరిజనమనంబులఁ జూఱఁగొనియెదరు. వారస్త్రీలును వచ్చి కొందఱు స్వస్వగాన నృత్యాభినయముల సభాస్తారుల సంతోషపెట్టిరి. అంబటి లక్ష్మీనరసింహరాజప్రభృతి కవిభట్టు లెప్పటి కప్పు డుత్సవవిశేషములను విద్వాంసుల విద్యాధిక్యమును ఛందోబద్ధమగు నాశుకవిత్వముతో వర్ణించి జయజయధ్వానములు సభాసదులచేఁ జాలసారులు సలిపించుచు వచ్చిరి. ఇట్టిసంవత్సరపు టుత్సవ మెంతయుఁ బ్రశంస్యము. ప్రాఁతక్రొత్త పండితులు పారితోషికములఁ బరితుష్టులు. విద్యాపరిచితి యంతగా లేని వేరోయభినవసరస్వతికిచ్చు ప్రధానపోషకధనమును బంచాంగకర్తలగు మక్కపాటి సోమసుందరసిద్ధాంతిగారికిచ్చు ౧౫౦ రౌప్యములును యాదగిరిసంస్థానమున కధికభారమని యాలోచించిరఁట. కమిటీదారులలోఁ బ్రధానులగు రామదయాళుసేటుగారితో నేమో యనిరఁట. పరీక్షాధికారులలో నొకరును నురరీకరించి తఱిగించియిచ్చుటకుఁ దీర్మానించిరఁట. పంచాంగకర్తలు పలువురు నేరియాశ్రయమునో యీపంచాంగములు ముద్రింపించి కృతజ్ఞతాసూచకముగా వారి యాస్థానపండితులమని వ్రాసికొనుచున్నారు. స్వజ్యోతిశ్శాస్త్రపాండిత్యప్రదర్శనపురస్సరముగా సత్కృతులగుచున్నారు.

ఇయ్యాదగిరిసంస్థానమున జ్యోతిశ్శాస్త్రమునకును బరీక్షయున్నది. సోమసుందరసిద్ధాంతిగారే తత్పరీక్షకులు. పరీక్షాధికారులగు మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారికిని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని నియ్యుత్సవసన్మానముగా ౧౫౦ రౌప్యము లీయఁబడుచున్నవి. ఇట్లే సిద్ధాంతిగారికిని రు ౧౫౦ యీయఁబడుచున్నవి. పంచాంగముద్రణముఁ

పాండిత్యముఁ బరీక్షాధికారము మూఁడును సిద్ధాంతిగారి అగ్ని వార్షికమునకు మూలములు. ఈవార్షిక మెన్నఁడో యేర్పాటుచేయఁబడినది. కమిటీవారి యధికారము వచ్చినయనంతరముగూడఁ గ్రమముగా జరుగుచున్నది. ఇఁక నభినవసరస్వతియో ? 33 సం॥ల నుంచి తప్పక ప్రకటింపఁబడుచు బహుకాలమునుండి ప్రధానపోషకధనము యాదగిరిసంస్థానము వలన నందుకొనుచున్నది. ప్రాచీనధర్మమునకును ప్రాచీన భాషకును బరివర్తనము గలుగఁగూడదను పట్టుదలతో నిది పాటుపడుచున్నది. అందుచేతనే ధర్మసంస్థాపకుఁడగు యాదగిరి లక్ష్మీనరసింహస్వామి యద్దానిఁ బోషించుచున్నాఁడు. ఇంతకుఁబూర్వ మీక్షేత్రమున ధర్మకర్తృత్వము వహించిన శేషాచార్య హనుమంతరాయ ప్రభృతులు సంపాదకుఁడు నద్దినములో సప్తదినములో నుత్సవమందుండవలయునను నిర్బంధము లేకుండ శీఘ్రముగనే పారితోషిక మిచ్చి పంపుటయే కాక యుత్సవేతరకాలమున వచ్చినను నిచ్చుచు వచ్చిరి. అట్లు రాకపోయినను వారే పంపుచుఁగూడ నుండిరి. అట్టి యభినవసరస్వతి సంపాదకుఁడు ౬౭ యేండ్ల యీడునఁ బ్రాచీనధర్మభాషా ప్రచారమునఁ గల పట్టుదల వీడలేక పడుచుఁ బడుచు వచ్చి పర్వతముపై నుత్సవసమ్మర్దమున స్నానపానాదులకు సముచిత సౌకర్యములు లేక సంకటపడుచు షట్సప్తదినములు స్వామిసన్నిధి నుండియు బహుకాలనియమిత పత్రికాప్రధానపోషకధనము పంచవింశతిరూప్యములు పరిగ్రహించుటకుఁ బాత్రముకాఁడని భావించు పాషాణహృదయముల పరివర్తనమును బరమేశ్వరుఁడు తప్పఁ బరులెవ్వరు చేయఁగలరు ? పెరిఁగింపవలసినదానికి మాఱుగాఁ దఱిగింపఁ దీర్మానించిన తత్పరీక్షాధికారులకు ధన్యవాదములు. దేశో విశాలః ప్రభవోఽ స్యనంతాః, రాలిపోయెడి యాకు రాలిపోయినఁ బెట్టెడియాకు పెట్టుచుండును. కాని ప్రధాన పరీక్షాధికారియగు మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారు మరల సేటుగారి చిత్తమును బాటునఁ బడవేసిరి. అందఱకు నిచ్చువాఁడు దేవుఁడే యున్నవాఁడు కావున యథాప్రకార మరుదెంచుచుండుఁడని యా రామదయాళుసేటుగారు సిద్ధాంతిగారికిని నాకును జెప్పివేసిరి. ఆయన యనుంగుల యాలోచనలచే నపథమున నడుగువెట్టినను హితబోధ యేర్పడుటతోడనే హృదయమును మార్చుకొను మతిమంతుఁడుగాని వితఘ్నుండు కాఁడు. ఇట్లే భగవత్సేవ లేక పంచములు పాపకూపమునఁ బడుచుండిరి కావున గాంధీమహాత్ముఁడు పెట్టిన హరిజన నామ మన్వర్థముచేయుమని యేదేశనాయకంమన్యు లేమి బోధించిరో యేమో స్వామికి సమ్ముఖముగాఁ జాల సమీపమున నంత్యజులకొఱకని యాలయమొక్కటి కట్టించి యందు దేవతాశిలఁ బ్రతిష్ఠించుటకుఁగూడ భావించిరి. ఇంతలో నవ్వార్త యంతట నలముకొనెను. పత్రికలలోఁ బ్రకటింపఁబడెను. అట్లు ప్రజాబాహుళ్యమున కనభిమత మగుటయుం హైదరాబాదు స్టేటు సనాతనధర్మసభవారికి మహజరులే రాఁదొడఁగెను. తత్సభాకార్యస్థానము మానేజరు శిరోమణి ధర్మపురి శేషగిరిశర్మగారును నిజాంరాష్ట్ర శ్రీవైష్ణవసంఘాధ్యక్షకార్యదర్శి ప్యారీక శ్రీరామాచార్యులుగారును యాదగిరి కరుదెంచి యాథార్థ్యమేమియని యాస్థానపండితుల నడిగిరి. దివ్యవాణీపత్రికాధిపతులగు చివుకుల అప్పయ్యశాస్త్రిగారును జేరవచ్చిరి. అందఱును గూడి యాదగిరి హక్కుదారగు భాస్కరరాయని సీతారామయ్యగారి ప్రత్యక్షమునఁ బంచమదేవాలయవార్తనుగూర్చి ప్రశ్నించిరి. ఆప్రశ్నను సేటుగారు వాస్తవమునకు వారికొఱకయియే గుడి

కట్టింపఁబడినది కాని యిందఱుపండితులకు నిందఱు ప్రజలకు నిష్టముగాని పనిగా నిప్పుడు తెలిసికొని విగ్రహప్రతిష్ఠను విరమించుకొంటినని విస్పష్టముగాఁ జెప్పి తదాలయపుఁ దాళపుచెవిని దక్షిణామూర్తిశాస్త్రిగారికిఁ దక్షణమ యిచ్చివేసిరి. అస్మదాదుల నా గుడివద్దకుఁ దీసికొనిపోయి దానికిఁ జుట్టు నున్న చిన్నగోడ పెద్దఁజేసియు నరసింహ దేవాలయమునకును నియ్యాలయమునకును మధ్యనున్న గోడకు ద్వారముపెట్టియు నయ్యాలయమునఁ గలిపివేతుమనియు నంతరంగముచు వ్యక్తపఱచెను. తాళపుచెవి దక్షిణామూర్తిశాస్త్రిగారి దగ్గఱనే యుండుటం జేసి పండితులే యానూత్నాలయము నప్పటినుండి యలంకరించిరి. పంచమదేవాలయమన్నపేరు మాసి శంకరమఠమని సన సన్నగా వినవయ్యెను. ఇట్లెప్పుడేని తప్పుత్రోవఁ ద్రొక్కినను సేటుగారిచిత్తము పాటు వనే పడుచుండును.

---

## —• దేవాలయప్రవేశము •—

(వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు)

మ. వ్యవహారంబున లాభ మాసపడి యన్యోన్యంబు సంధించి య
భ్యవహారంబులుచేయుచుం దిరుగుచున్ భాషించుచున్ వ్రాయుచున్
స్తవముల్ సేయుచుఁ బత్రికన్ దినము వార్తల్ నింపుచుం బంచమో
త్సవముల్ సల్పుచు దేశనాయకులు పెల్బం గాంచుచున్నా రహో!

ఉ. వండుట? వార్చుటా? శుచిగ వందలు వేల్ దనియంగఁబెట్టుటా?
రండని పండితేంద్రులకు రాసులు కాసులు పంచిపెట్టుటా?
అండగ సాధులన్ మనుచుటా? ఇది యేమని పూని గుళ్ళలో
నుండెడు దేవతాళిపయి యుద్ధముచాటిరి వీరనాయకుల్?

మ. మొనగాండ్రైన నిఁకార్పుకొం, డిదిగో నిప్పుం గొంపకుం బెట్టినా
మనుచున్నారుగ! సంప్రదాయములఁ ద్రోయంబూని దేవాలయం
బునకుం దోలుదు రౌర మాలల మహాత్ముల్! మిమ్ము నెవ్వార లే
మనఁజెల్లుం గవిరాజు మీకిడ నవార్యంబైన శౌర్యం బహో!

శా. నన్నున్ మేలనిపింపురా కొడుక యన్నాఁ డన్నటుల్ నేఁడు ము
న్నెన్నం డెట్టినికృష్టుఁడేని మదినే నెన్నంగఁబోనట్టి వ
న్నన్నా! నాయకులంచు సల్పుచిడు దేవాగారముల్ దూఱుచున్
మన్నున్ మిన్నును గాన కాడెదరు రామా! వీర లేవారలో?

ఉ. రాజును ధర్మబద్ధుఁడయి రాజ్యముఁ జేయుఁబొ కాని వాని దు
ర్యోజనవెంట నేలుటది యొప్పదు. తప్పది తప్పు. నేఁటికీ
యోజను దక్కొరుల్ సలుపకుండఁగఁ దప్పును దిద్దుకొమ్ము. వి
భ్రాజితకీర్తిగొమ్ము తిరువాన్కురు రాజకిశోరరత్నమా!

ఉ. వెల్లువవోలె వచ్చిపడు వేగమునాపఁగ నెవ్వఁడోపునో
చెల్ల! స్వధర్మగేహముల శిష్టులతో నదె ముంపఁజొచ్చె నీ
యల్లరిమూఁక శాస్త్రనిగమాగమసూత్రములెల్లఁ ద్రెంపుచున్
గొల్లుమనంగఁ జేసెదరు గోల స్వరాజ్యము తెచ్చినట్లుగన్.

చం. కొడుకులు వీధిలోని కిటు కొంగులుపట్టుక తల్లి నీడ్తురే?
మడి నిటు మైలచేయుదురె? మంత్రము మర్మము బైలొనర్తురే?
గుడియును గోప్యమున్ చనక కూళతనంబున నున్న దెల్ల నా
గడ మొనరింతు, రెంతఘనకార్యము చేసెద? రేడ నేర్చిరో!

ఉ. దప్పికనీళ్ళలోపలఁ బదంబులు తొళనచేయువానికిన్
తప్పదు నేఁతలే పరమధర్మములౌ టొకయబ్బురంబొకో?
చెప్పెడివాఁడు లేక యిటు చిల్లరనేఁతలకుం గడంగినా
రప్పరమేష్ఠి కిద్ది యొకయాటగ నుండఁగఁబోలు నేటికిన్!

ఉ. భూతిని దేఁగఁబోయి యొకభూతము దెచ్చిరి కొంపమీఁది. కే
నీతివిదుండొ మిమ్ము నిటు నేర్పుగ లక్ష్యముదప్పఁగొట్టి పెన్
గోతిని ద్రోసినాఁ డొరులకుం జెయిచిక్కకయుండ. మున్ను మీ
తాతలు గుళ్ళ దాఁచిన ప్రధానధనంబును వీటఁబుత్తురే?

ఉ. గుప్పెఁడు వేలగింజలకుఁ గుఱ్ఱలు కుప్పకు నిప్పుపెట్టు నా
చొప్పది దాయలందఱకుఁ జూడ వినోదమె కాని. కొంపకున్
ముప్పగుఁగాదె! మ్లేచ్ఛులును మున్నొనరింపఁగలేని కీడు మీ
రిప్పుడు చేయనెంచు టది యింటను బుట్టిన దోసమే కదా!

ఉ. ముక్కిడివానిమాట విని ముక్కులు తాము గోసికొంచు నా
టక్కరియట్ల తాముఁ గపటంబున లోకులతోడ నాడియున్
ముక్కుల పోకకై మదిని బొక్కినఫక్కిగఁ దాము భ్రష్టులై
తక్కినవారినిం జెఱుప దబ్బరలాడెద రౌర ధీరులై.

ఉ. పిల్లఁడు ముద్దియౌ, నతని పెంకెతనంబును ముద్దె. ఇప్డు నీ
రెల్లరు సోదరుల్ నిజమె, యూసయు బాస యొఱుంగకుండ నేఁ
డెల్లియు వీరొనర్చు పనులెల్లఁ దలంచిన గుండె జల్లనున్.
పిల్లనిచేతి దెబ్బయును బెద్దగఁ దాఁకు నపాయమౌనెడన్.

ఉ. ఏటున కేడుజీవముల నీల్గఁగఁజేసెడు పోటుమానుసుల్
నేఁటికి దేవసద్మములు నేలకుఁ గోలకుఁ దెచ్చువా రహో!
మాటలె ధర్మశాస్త్రముల మర్మ మెఱుంగఁగ! మంత్రసంపదన్
లూటియొనర్చు శూరులకు లోకము లెవ్వి విధాత చేసెనో!

---

క. పతియింట నస్వతంత్ర
స్థితినుండెడుచానవోలె జీవవశగయై
వెత నందు నాదుమతి యీ
ప్సితముం గన, దూఱటయును జెందదు తండ్రీ! 501

చ. కతిపయపర్ణముల్ తుహినఘాతమునన్ దళియించి వెండియున్
గతిపయపర్ణముల్ రసముకల్మిని దాలుచు పుష్యమాసపున్
లతికగతిన్ వివేకపు బలంబునఁజేసి మదీయబుద్ధి వాం
ఛితములఁ గొన్ని వీడియుఁ దళింపదు కొన్నిటి వాసనాస్థితిన్. 502

తే. గీ. ఐహికాముష్మికాశలా యడఁగిపోయెఁ
జిత్తమునకును శాంతియా చిక్కదాయెఁ
బాడుసంసృతి నన్నిట్లు పట్టుకొనక
వదలకయు రెంటఁజెడిన రేవనిగఁజేసె. 503

క. మునివర! యటుగావున నా
కనుపాధిక మభ్రమం బనాయాస మజం
బనేఘ మశోక మ్మగుపున
ర్జననంబగు శాంతిపదము సమకూర్పఁగదే. 504

మ. జనకాదుల్ వ్యవహారతత్పరమతిన్ సర్వక్రియారూఢు ల
య్యును నిర్లిప్తత నొప్పుటెట్లు? మఱియున్ యుష్మాదృశుల్ నిత్యపా
వనచిత్తుల్ గతకల్మషుల్ బుధులు జీవన్ముక్తు లేదృష్టి నై
కొని సంసారమునన్ జరింతు? రిది నాకున్ దెల్పవే సత్కృపన్. 505

తే. గీ. నరుఁడు సంసారపంకమ్మునన్ జరించు
చుండియును నంటకయ యుండు యుక్తి యెద్ది?
విషయములవేరి భీకరవిషధరమ్ము
లతని కెంతయు భవ్యమ్ము లగుట యెట్లు? 506

తే. గీ. ప్రబలమోహమదేభంబు పడి కలంచ
దోషసంచయకర్దమదూషితాంత
రం బయిన బుద్ధిపద్మాకరంబు సుప్ర
సాద మందుట యెట్టులు? సాధుచరిత! 507

తే. గీ. తామరాకున నీటిచందమున సంస
రణమునం దుండియున్ బంధరహితవృత్తిఁ

గాయసంగతి లేక జగం బఖిలము
నాత్మరీతిగఁ గనుభాగ్య మందు టెట్లు ? 508

వ. వెండియు 509

సీ. వేధోవినిర్మిత విశ్వవిశ్వమునకుఁ
బూర్వాపరంబులు బోధపడఁగ
హృదయాంబరంబునం దెసఁగు చైతన్యచం
ద్రునిలోని మచ్చ మార్జనమునంద
హేయ ముపాదేయ మితరం బెఱిఁగి మది
శైలంబురీతి నిశ్చలతఁ గనఁగ
ఆనందతరుపుష్ప మగుశీతలత్వంబు
నంతఃకరణమునం దలముకొనఁగ
తే. గీ. దుష్టసంసరణవిషూచి తొలఁగిపోవ
గాఢపీడాకరంబౌ వికల్పచయము
లణఁగ నే నెట్టియుపదేశ మందవలయు
నది వచింపుము నాకు దయాప్రధాన ! 510

తే. గీ. ఉత్తమానందపదమందుఁ జిత్తశాంతి
కలుగకుండిన నరుని వికల్పచయము
సతతమును బట్టి పీడించు, జాగిలంబు
లలఁతిజంతువుఁబట్టి వేఁటాడునట్లు 511

శా. దేవా! జీవితకాననాంతరమునన్ దిగ్గాడు నాపై భవ
ప్రావృణ్మేఘ మనర్థవర్షణ మొనర్పన్ సాగె నే నిప్డు దే
త్రోవన్ బోవుదు? నేయుపాయ మొనరింతున్? సంశ్రయింపంగ నే
ఠావున్ జేరుదు? నెట్టు లిద్ది యశుభోదర్కంబు గాకుండెడిన్? 512

క. స్వామీ! మీరు తలంచిన నేమూఢుండయిన నెట్టిహీనుండైనన్
నేమపుఁదెరు వందనివాఁ డీముల్లోకంబులందు నెందును గలఁడే?

వ. కావున నన్నుం గరుణించి సాంద్రదుఃఖసమాకులంబగు నీ నీరస సంసారంబు మోహానిరసనద్వారంబున సరసత్వంబుగాంచు సదుపాయం బెఱిఁగింపుము. దేవా ! వసుంధర పుష్పశోభితం బగువసంతంబునంబోలె మదీయజీవితంబు పూర్ణకామత్వం బనుక్షీరస్నానంబున రమణీయం బగు టెట్లు ? గురువరేణ్యా ! కామకలంకితంబగు

మామక మనశ్చంద్రబింబంబునుండి యమృతద్యుతి యెట్టితెఱంగునం బొడమి, అగ్నిశిఖవలె నంజేసి వెలువడు? మునీంద్రా! సంసారానర్థంబుల నెఱింగి యైహికాముష్మికంబుల సంత్యజించిన యేమహాపురుషు ననుసరించి యేను దుర్గమంబులగు సంసరణసరణులందు సంచరింపవలయు? సంయమీంద్రా! భవార్ణవనిమగ్నుండగు దేహిని రాగద్వేషాది రోగంబులును భోగహేతువులగు సంపదాది విషయజాతంబులును బాధింపకుండు నుపాయం బెయ్యది? భూసురోత్తమా! పారదం బగ్నినిక్షిప్తం బయ్యును దగ్ధంబుగానిచందంబున మనుజుండు సంసృతిస్థితుండయ్యును దాపత్రయపీడితుండు గాకుండు మార్గం బెద్ది? పురుషుండు భవంబునం దుండి వ్యవహారక్రియారహితుం డగుట సముద్రపతితుండు జలస్పర్శంబు లేకయుండుటంబోలె దురూహంబు. రాగద్వేషరహితంబులును సుఖదుఃఖవర్జితంబులును నగు సద్వ్యవహారంబులు దాహకత్వంబులేని యగ్నిజ్వాలలరీతి నసంభవంబులు. రాగద్వేషంబులకు నిదానభూతంబగు మనస్సత్త సర్వవిషయబాధక తత్వబోధ హేతుయుక్త్యుపదేశంబునంగాని నశియింపదు. కావున నట్టి యుత్తమోత్తమంబగు యుక్తి నాకు బోధించి మదీయదుఃఖం బపనయింపుము. తొల్లింటి సాధుపూరుషు లెట్టియుపాయంబు నవలంబించి నిర్దుఃఖంబగు చిత్తవిశ్రాంతి నధిగమించిరి? అట్టివా రెవ్వరేనిం గలరే? ఇదియెల్లఁ దెల్లంబుగాఁ దెలిపి నన్ను రక్షింపుము. అట్లుగాక. 514

ఆ. వె. అట్టియుక్తి జగమునందె కల్గకయున్నఁ
గలిగి దాని నేరు తెలుపకున్నఁ
దెలుప నద్ది నాకు నలవడకే యున్న
మునివరేణ్య! నాదుపూన్కి వినుము. 515

సీ. కోరిక లన్నియుం గొనముట్ట విడిచి య
హంతయు మమతయు నవలఁద్రోచి
స్నానదానాశనపానవిహారాది
సకలకర్మంబులు సన్న్యసించి
సంపద్విపద్దశల్ సరకుసేయక విమ
త్సరుఁడనై సర్వసంశయము లుడిగి

మౌనంబుఁ బూని క్రమంబుగా శ్వాసల
బంధించి దేహసంబంధ మెడసి.
తే. గీ. ఒక్కచోఁ జిత్తరువురీతి నురక నిశ్చ
లముగఁ గూర్చుండి క్రమతఁ దైలంబు లేని
దీపమువిధాన శమియించి దేహనామ
కంబగు ననర్థమును వేగఁ గడచువాఁడు. 516
ఉ. శీతకరాభిరాముఁడగు శ్రీరఘురాముఁడు సద్విచార వి
ద్యోతితచిత్తుఁడై గురులతో నిటు పల్కి ముగించె మింట న
త్యాతతమై తనర్చు జలదావళులన్ దిలకించి ప్రీతిమై
కూఁతలు వేసివేసి తుదకున్ విరమించెడి కేకిచాడ్పునన్. 517
వ. అనిచెప్పి వల్మీకసంభవుం డరిష్టనేమి కిట్లనియె. 518

**—• శ్రీరామవాక్యమును విని శ్రోతృవర్గము విస్మయమందుట •—**

క. మోహనివృత్తికరములు మ
నోహరము లుదారములు వినూత్నార్థములౌ
వ్యాహారము లర్కాన్వయ
నీహారాంశుండు సభను నిగదించునెడన్. 519
ఉ. ఆసభనున్న వారలు మహత్తరవిస్మయఫుల్లనేత్రులై
నాసికలందు వ్రేలిడి మనంబు ఘనంబగు నవ్విరాగపున్
వాసనలంద సంసరణవాసనలం దిగనాడి మోదవా
రాశి సుధామయోర్మినికరంబులఁ దేలిరి మానవేశ్వరా! 520
తే. గీ. రామచంద్రుని వాక్సుధారసము లాను
నుత్సుకతఁబోలె రోమంబు లొడల నిక్క
పొడిచి వడి నంబరములు వెల్వడఁగ వింజ
మాకిడినయట్లు కూర్చుండి రచటి జనులు. 521
క. ఆనందపీవరము లగు
మేనులతో నిటుల నటుల మెదలక ప్రీతిన్
శ్రీనిలయుని వాగమృతముఁ
బానముగావించి రెల్లవారు నరేంద్రా! 522
శా. సానందంబుగ నాలకించిరి తదీయాలాపముల్ బ్రహ్మవి
ద్యానిష్ణాతులు గాధినందనవశిష్ఠాదుల్ మునీంద్రుల్, సుమం

## శంకరాచార్యులు జన్మించి బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయుట

దేవతలు కేవల క్రతుభుజులు. క్రతువులు చేయఁబడకయున్నప్పుడు క్రతుభుక్త్వము సార్థకమగుట కష్టము. ఇదియంతయుం వీక్షించి లోకానుగ్రహదృష్టిమై లోకత్రయమున సంచరించు నారదమహాముని బ్రహ్మకడకుఁ జని భూలోకపరిస్థితియంతయుం విన్నవింప నాచతుర్ముఖుండు దేవగణసమేతంబుగ శంకరుసన్నిధి కరిగి శ్రుత్యాచారపరిత్యాగ మిథ్యాచారసమాశ్రయాది మర్త్యలోకసమాచారమంతయుఁ మనవిచేయుంటయుఁ దత్సదాశివుండు జ్ఞానకాండము నుద్ధరించి మానవులఁ దరింపఁజేయ సంకల్పించినవాఁడై జ్ఞానసాధనములగు కర్మోపాసనాయోగాదులంగూడఁ బ్రచారముసేయ బ్రహ్మాదుల కాజ్ఞయిచ్చెను. అంత బ్రహ్మ మండనమిశ్రుఁడుగను గుమారస్వామి కుమారిల భట్టుగను జక్రధరుఁడు సంకర్షణుఁడుగను శేషుఁడు పతంజలిగను శునాసీరుఁడు సుధన్వుఁడుగను నిట్లే మఱికొందఱును మహీతలంబున నవతరించిరి. కుమారావతారమైన కుమారిలభట్టు దగ్రగణ్యుఁడు. ఆయనకే భట్టపాదుఁడను నామాంతరము. ఈయన యింద్రావతారమైన సుధన్వనృపతి సాహాయ్యంబునఁ దత్పూర్వమున లోకమంతట దృఢీకృతమై యుండు జైనబౌద్ధమతముల నిర్మూలించి కర్మమార్గమును వ్యాపింపఁజేసెను. కర్మోపాసనాజ్ఞానములలో నుత్తమమును జ్ఞానప్రాప్తిసాధనమును జ్ఞానమేయైనను దత్సాధనములగు కర్మోపాసనలుగూడ నావశ్యకములై యుండుట వలన సంకర్షణపతంజలు లుపాసనాకాండమును భట్టపాదుఁడు కర్మకాండము నుద్ధరింప వలసినవారైరి. జ్ఞానకాండోద్ధరణమును శంకరుఁడే శంకరుఁడై చేయనుండుటం జేసి వీరు దాని పేరే యెత్తికొనక కేవల కర్మోపాసనల వలననే కైవల్యప్రాప్తి యగునట్లు బోధించి జనులచే స్వసిద్ధాంతితముల ననుష్ఠింపఁజేయఁగడంగిరి. భట్టపాదుఁడు పుట్టకపూర్వము ప్రపంచమున బౌద్ధపాషండచార్వాకాది వేదబాహ్యమతములు ప్రబలిపోవుటయుఁ బ్రజ లపుడు బ్రహ్మ బ్రహ్మవిద్బ్రాహ్మణులపైఁ బరమద్వేషము వహించి సంధ్యా సన్న్యాసాది వర్ణాశ్రమధర్మవిముఖులై శ్రుతియను నక్షరద్వయముగూడ శ్రుతులం బడనీయక ప్రవర్తిల్లఁజొచ్చిరి. కొందఱు వర్ణాశ్రమధర్మముల వర్జింపకున్నను లింగచక్రాది చిహ్నంబుల ధరించి పాషండత్వ మవలంబించిరి.

అందువలనఁ బ్రప్రథమము సంకర్షణపతంజలులు పాణినీయవ్యాకరణమునకు భాష్యమువ్రాసియుం యోగసిద్ధాంతములఁ గల్పించియుం ధర్మకల్పనములచే జనుల యాచారవ్యవహారముల మార్చి యుపాస్తియోగకాండము నుద్ధరించి మించిరి. తరువాత భట్టపాదుఁడు మండనమిశ్రుని తోడ్పాటుతోఁ గర్మమార్గవ్యాపనమునకై కడుఁ బ్రయత్నించెను. ఆసమయమున సుధన్వుఁ డఖండభూమండలాధిపత్యము వహించి యంతటను బౌద్ధమతం బలముకొనియుండుటం జేసి తానును దన్మతప్రవిష్టుఁడై తనరుచుండెను. అయ్యెడ నాత్మవైదుష్యంబున నచ్చటచ్చటి దుర్వాదిపండితులఁ బరిభవించుచుఁ గ్రమముగా భట్టపాదుఁడు తదాస్థానంబునకుఁ జనుదెంచెను. అట్లు చనుదెంచిన భట్టపాదుని బహూకరించి బౌద్ధపండితులతోడి వివాదమునకుఁ బ్రవేశపెట్టుటయుం బౌద్ధమతంబును

బహువిధంబుల ఖండించి ప్రదర్శితబహువిధమహత్త్వుండై యామహనీయుఁ డాయవనీశ్వరు నభిముఖుం జేసికొనియెను. అంత నాతఁడు తాను బౌద్ధుఁడైయుండియుం భట్టపాదమతమే పరమయోగ్యమై కనుపట్టినందునఁ గర్మమార్గప్రవిష్టులుగాని దుర్మతుల నందఱ ఖండింప నాజ్ఞాపించుడుఁ గొంద ఱందుఁ బ్రవేశించిరి. కొందఱు ప్రవేశింప నొల్లక దేశాంతరగతులైరి. మఱికొంద ఱట్లు నిట్లుఁ గాక హతులైరి. అట్లు రాజాదరము కలిగినకతంబున మగుడ మహీతలంబునఁ గర్మమార్గ మెల్లెడల నలముకొనసాగెను. అపుడు దేశాంతరగతులైన బౌద్ధులే యిపుడు జైనులు జపానులుగా నుండఁబోలును. ఇట్లు కర్మోపాసనాకాండములు రెండును గడుంగడు వ్యాపించుటయుం గంగాధరుఁడు క్రమముగాఁ గటాక్షించి కాలట్యగ్రహారమున హేలాధృతమనుష్యశరీరుఁడై యెంతయు విరాజిల్లెను. ఆకాలటి కేరళదేశస్థము. కేరళమునకే మళయాళమని మఱియొక పేరు. అయ్యూర వివిధవిద్యాపారంగతుఁడగు విద్యాధిరాజను నంబూద్రిబ్రాహ్మణు కొమరుఁడు శివగురునివలనఁ దద్ధర్మపత్ని యార్యాంబ కనుఁగుంగొడుకై యావిర్భవించి శంకరుండనియే జనులచేఁ బిల్వఁబడియెను. పంచసంవత్సరములకే బహుశాస్త్రములు పఠించెను. ఉపనయనము గాకమున్న శివగురుఁడు శివపదముఁ జేరనరుగుటయుం శంకరుఁడు జననీసంరక్షణమునకే సంస్కరింపఁబడి సంసారసాగరనిమగ్నుల సముద్ధరింపనే జన్మించినవాఁడగుట షట్సప్తవత్సరప్రాయముననే సన్న్యాసాశ్రమస్వీకారమునకు సమ్మతించెను. అంబ యార్యాంబ యంగీకరింపదు. తల్లియాజ్ఞ లేక తదాశ్రమస్వీకారము ధర్మసమ్మతము గామి నామహాత్ముఁ డాత్మీయాసన్నమరణ మమ్మ కగపఱచి యంగీకారమును బడసి యాక్షణము యాతురసన్న్యాస మవలంబించెను.

అది మనస్సన్న్యాసము యగుటఁ బనికలిగినపుడెల్లఁ జనుదెంచి సమకూర్తునని జనని నూఱార్చి క్రమసన్న్యాసస్వీకృతికిఁ గర్మందుల నరయుచు నుత్తరదిగభిముఖుండై యొకకొంత చనియెను. అత్తఱి నుత్తరదేశమున నర్మదాతీరమందలి యొక కొండగుహాంప్రవిష్టుఁడై గోవింద యోగీంద్రుఁడను పావనచరితుఁ డొకరుఁడు పరఁగుచున్నవాఁడు. ఆయన గౌడపాదు లనుకర్మందికిఁ బ్రియశిష్యుఁడు. గౌడపాదులు శ్రీశుకులకు శిష్యుఁడు. శుకుఁడు వేదవిభాగకర్తయు నష్టాదశపురాణకారుఁడు బ్రహ్మసూత్రగ్రథకుఁడు నగు వ్యాసుల కుమారుఁడును శిష్యుఁడును ననునది మన మిదివఱకు భారతభాగవతాదులం బఠించియే యున్నవారము. అట్టి శ్రీశుకులకుఁ బ్రశిష్యుఁడగు గోవిందయోగీంద్రునాశ్రమంబునకు శంకరభగవత్పాదులు చని యభివాదనపూర్వకంబుగా నభినుతించుటయు నతని సాధనచతుష్టయసంపత్తికి సంతసించి గోవిందయోగీంద్రుఁడు మహావాక్యోపదేశంబున ననుగ్రహించి ముఖ్యశిష్యులలోఁ జేర్చుకొనియెను. అట్లు గురుశిష్యు లుభయులుం గొంతకాల మాత్మానుసంధానపరులై యుండుటయు నింతలో నతివృష్టిపాతంబున నర్మదానది తదాశ్రమము ముంచుకొనుచుం జనుదెంచెను. అయ్యెడ శంకరుఁడు తపోబలంబునఁ దత్ప్రవాహమును దన కమండలువులోని కాకర్షించెను. ఇట్టి మహామహిముఁడగు శిష్యుఁడు దొరకుటకు గోవిందయతీంద్రుఁడు పరమహర్షముఁ జెంది కాశీపురంబున

కరిగి వ్యాసకృత బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయుమని యాజ్ఞయిచ్చుటయుం నయ్యార్యుం డప్పురిం బ్రవేశించి లోకపావని యగు గంగం గృతావగాహుండగుచును విశ్వేశ్వరు నర్చించుచును గొంతకాల ముండి సనందనాది స్వశిష్యులతో స్వమతసిద్ధాంతముల వెల్లడించు తఱి విశ్వేశ్వరుం డొకపరి విలాసముగా నంత్యజవేషధారియై నలు ప్రక్కల నాలుగు సారమేయముల వెంబడించుకొని శంకరుండు శిష్యసహితముగ గంగాస్నానార్థమరుగునెడఁ గనఁబడియెను. తద్యతీంద్రుం డవ్వాని దవులనరుగుమని ధర్షించుటయుం నుభయులకు నొక్కింత యుత్తరప్రత్యుత్తరము లొసఁగికొనవలసిన ప్రసక్తి యొదవెను. ఏకమేవాద్వితీయం, ఏష ఆత్మాఽపహతపాప్మా, నిరవద్యం నిరంజనం, అసంగో హ్యయం పురుష ఇత్యాది వేదాంతవాక్యప్రసిద్ధమగు నాత్మయందు వేదాంతిత్వమునఁ బ్రసిద్ధుఁడవగు నీవును భేదకల్పనము చేయుట యాశ్చర్యకరమని తన్మనోనిశ్చయము గనుగొనుటకు విశ్వేశ్వరుఁడు ప్రసంగింప

శ్లో. భాతి యస్యతు జగ ద్దృఢబుద్ధే స్సర్వమ ప్యనిశ మాత్మతయైవ
స ద్విజోస్తు భవతు శ్వపచోవా వందనీయ ఇతి మే దృఢనిష్ఠా

అను వాక్యముచే నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మ యను యాజ్ఞవల్క్య వచనము ననుసరించి, యేదృఢబుద్ధికి సర్వజగంబును నాత్మగాఁ గనఁబడునో వాఁడు బ్రాహ్మణుఁడుగానీ చండాలుఁడుగానీ నాకు వందనీయుఁడని ప్రత్యుత్తరమిచ్చెను. అంటుదోషమునుగంటింపఁజూచు నద్వైతను లాత్మవాదమున కది యొక యాధారమని యనుకొందురు కాని యందలి నిజ మారసిన వారి కెంతమాత్రము నుపయోగించునది కాదు. అఖిల ప్రపంచమునందును నాత్మబుద్ధిగల చండాలుఁడుగదా యభివంద్యుఁడయ్యెడు! అట్టివాని నంటనీయనివా రెవ్వరు? ఈయర్థము

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః

అని ద్వాపరాంతమునఁ గృష్ణభగవానుఁడే చెప్పియున్నాఁడు. ఇందలి పండిత శబ్దమునకు 'యేషాం జ్ఞానేన నాశిత మాత్మనోఽజ్ఞానం తే పండితా' యని శంకరులు భాష్యము వ్రాసియుండిరి. కాన నీవిషయ మజ్ఞాననివృత్తిద్వారమున జ్ఞానపరిపూర్ణులగు వారికి సంబంధించినది కాని యత్కించిల్లోకజ్ఞానవిశిష్టులమగు నస్మదాదులకు సంబంధించినది కాదు. అట్టిశంకరు ప్రతివచనమున కభినందించి విశ్వనాథుఁడు బ్రహ్మసూత్రములకు భాష్యమురచింపుమని యాజ్ఞాపించి యంతర్హితుఁడయ్యెను. శంకరాచార్యులు శివావతారమే యైయుండ మరల నాశివునితోడి ప్రశ్నప్రతివచనము లనుట యెట్లని కొందఱు సందేహ మందవచ్చును. విష్ణ్వవతారమైన వ్యాసునకు విష్ణువుతోడం బోలె శంకరావతారమైన శంకరాచార్యునకు జ్ఞానకళావతారమగు శంకరుతోడి సంభాషణము సంగతమే యయ్యెడిని. శంకరభగవత్పాదు లంత నవిముక్తక్షేత్రమందలి యఖిలతీర్థములను సేవించి బదరికాశ్రమమునకుఁ బనివిని పండ్రెండవయేట బ్రహ్మసూత్రములకు భాష్యమును వ్రాసెను.

వ్రాసి సనందనాది స్వశిష్యుల కందఱకును నుపదేశించెను. అందు సనందనుఁ డితరులకంటె నెక్కుడునియమ మవలంబించి గహనార్థమగు నాభాష్యము మగుడ మగుడఁ జదువ నభిలషించెను. అతని యద్వంద్వభక్తి నగ్గించి మహాత్మ్యము పరింపించి యీర్ష్యాభరాకులులగు నితరశిష్యుల కితని భక్తి వ్యక్తపఱచుటకై యొకపరి యాచార్యుఁ డభ్రాపగాపరతటస్థుఁడగు నతని నాహ్వానించెను. అంత నతఁడు సంసారసాగరమునే తరింపఁజేయఁగల గురుపాదభక్తి వియన్నది నేలతరింపఁజేయదని తత్సన్నిధికిఁ బోఁ ద్రిపథగా ప్రవాహమున దిగుటయు నడుగడుగునను నంబుజము లుదయించి యనాయాసంబున నవలియొడ్డునకుఁ జేర్చెను. అట్లు పాథోరుహన్యస్తపదయుగళుండై పరుగుపరుగున వచ్చి పార్శ్వమందు నిలిచిన పరమభక్తుఁ బరికించి బ్రహ్మణ్యుఁడగుశంకరుఁడు పరమహర్షమునఁ బద్మపాదసంజ్ఞ ప్రతిపాదించెను. పదపడి బౌద్ధపాశుపతాది పరమతముల ఖండించుచు బ్రహ్మసూత్రభాష్యమును బలుగడలఁ బ్రవచించెను. భూష్యతమంబగు నాభాష్యమును శ్రవణించినవారికి దురన్వయాది దోషదూషితములగు నితరభాష్యములు రుచింపవు. ఆచార్యానన నిర్యాతమగు నభిధాసిద్ధాంతముచే సంతతీకరణపరిశుద్ధి గలిగి యనేకులు కామాంధకపోలకల్పితములును బంధనాశాసమర్థములును నగు చిత్రపాత్రములఁ జేతఁ బట్టరు. పట్టణోపాంతమునఁ బ్రవహించు పంటకాలువ భాగీరథిం బోలెఁ బరులగ్రంథములు భగవత్పాదకృత బ్రహ్మసూత్రభాష్యమును ననుకరింపలేకపోయెను. విద్వజ్జాలతపఃఫలమును శ్రుతిఃధూధమ్మిల్ల మల్లీస్రజమును వైయాసికసూత్రమిత్రపుణ్యోదయమును వాగ్దేవీ చిరభోగ్యభాగ్యనిలయమును నగు నద్దానిని సంసారమునఁ బునరావృత్తిలేనివారందఱుఁ బఠింపఁగడంగిరి. త్రయీపయఃపారావారమునకుఁ దరికొండయగు నాగ్రంథరాజము పరాపరవిదులగు పండితప్రకాండులకుఁ బరమహర్షమొదఁ గూర్చుచును నన్యమతాంధకారపటలంబుల నంధీభవన్నేత్రులగు నజ్ఞజనులకుఁ దార్క్యార్కప్రకాశముల దారిఁ జూపుచును బ్రకాశించెను. అట్లు సేతువు మొదలుకొని శీతాచలముపఱకును నుదయాద్రి మొదలుకొని యస్తాద్రిపఱకును నాచార్యుల భాష్య మాచంద్రార్కస్థాయి కాఁగలిగెను. ఈవిధంబున శిష్యులకు భాష్యప్రవచనము చేయుచు నాచార్యుఁ డలరారుచుండ నవనీసురవేషధారియై వ్యాసమహర్షి యరుదెంచెను. ఇరువురును నెనిమిదిదినములు తద్భాష్యార్థవిచారమునఁ దగవులాడిరి. అంత

శ్లో. శంకర శ్శంకర స్సాక్షా ద్వ్యాసో నారాయణో హరిః,
తయో ర్వివాదే సంప్రాప్తే కింకరః కింకరో మ్యహం ?

అని పద్మపాదుఁడు భగవత్పాదునకు వ్యాసమహర్షి స్వరూపము వ్యక్తపఱచెను. పదపడి శంకరగురుఁడు బహుభంగులఁ బ్రస్తుతింప భాష్యమంతయుఁ బరిశీలించి దాని రామణీయకతకుఁ దద్దయు మెచ్చుకొని పదియాఱువత్సరములక పరమగతిఁ జెందనున్న యన్నిరాబారికి దుర్మతంబులఁ జెండాడి యద్వైతమతస్థిరీకరణద్వారమున నఖిలలోకముద్ధరించుటకుఁగా మఱి పదియాఱువత్సరముల యాయుష్య మొసంగి యంతర్ధానమయ్యెను.

# సహాయులు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి
౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
3 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల.
౪ తిరుమలనల్లాన్ చక్రవర్తివరదాచార్యుల అయ్యవార్లంగారు,
శాతాపురము.
౫ రాయచూరి బందేరావుగారు, అయినాపురము.
౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.
౭ చిక్కరాజు మట్టపల్లిరావుగారు - చెలకుర్తి.
౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు శ్రీశ్రీ జగద్గురు
పుష్పగిరి సంస్థానపు ఏజంటు.
౯ అద్దంకి ... తిరువేంగడతాతదేశికాచార్యులయ్యవార్లంగారు.
తక్కెళ్ళపాడు.
౧౦ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౧౧ మల్లావి నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.
౧౨ కురికాల వెంకటేశ్వరరావుదేశముఖుగారు, పులిగెళ్ళ.
౧3 రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.
౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.
౧౫ వద్దిరాజు సత్యనారాయణరావుదేశపాండ్యాగారు, మేడిపల్లి.
౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణికాలరీసు.
౧౭ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖుగార్లు
కాకర్లపల్లి,
౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.
౧౯ మద్దూరి సాంబయ్యగారు - పొగాకుకంపెని - పరుచూరు.
౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు
కొత్తపల్లి.
౨౧ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, ఎల్లారెడ్డిపల్లె.
౨౨ గడ్డం వెంకటనరసింహారెడ్డి దేశముఖుగారు, చెఱుకుపల్లి.
౨3 చావలి అవధానులుగారు,
బట్టలఫ్యాక్టరీ మేనేజరు, సికింద్రాబాదు.
౨౪ మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ

# అభినవసరస్వతి

సంపాదకుడు — నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము లును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 2 | నీతిగీతలు (సుమతిశతకము, చాణక్యశ్లోకములు) ... | 0 | 2 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 4 | కరణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] ... | 0 | 4 | 0 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 6 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 7 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 8 | శుద్ధాంధ్రహరిశ్చంద్రచరిత్రము ... | 0 | 10 | 0 |
| 9 | సూతసంహిత (ఆంధ్రము) ... | 2 | 0 | 0 |
| 10 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 11 | ధర్మనిర్ణయము ... | 0 | 4 | 0 |
| 12 | అస్పృశ్యతానివారణఖండనము (మల్లాదిరామకృష్ణచయనులుగారు) | 0 | 8 | 0 |
| 13 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | 1 | 0 | 0 |
| 14 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 15 | డిటో నాగరఖండము (౩ సంపుటము) | 1 | 8 | 0 |
| 16 | డిటో నాగరఖండము (౪ సంపుటము) | 1 | 8 | 0 |
| 17 | పల్నాటివీరచరిత్ర | 0 | 12 | 0 |
| 18 | భాగవతరహస్యములు | 0 | 4 | 0 |
| 19 | సోమేశ్వరశతకము | 0 | 2 | 0 |
| 20 | జాతకచర్య (స్వకీయులచరిత్ర) | 1 | 8 | 0 |
| 21 | వధూకాంబరీవిడంబనము | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోస్టు,
గుంటూరు జిల్లా